భారతదేశం బొగ్గుసప్లయిలను నిలిపివేయగా, దక్షిణాఫ్రికానుండి, పూర్వపు ఆంక్షలను రద్దుచేసి బొగ్గు తెచ్చుకోవడానికి ప్రయత్నించింది. అలాగే తాను జనుం ఎగుమతి చేయక అస్సాంనుండి వస్తున్న జనుమును జప్తుచేసింది. భారతదేశాన్ని ఏకోవిధంగా కవ్వించడమే పనిగా పెట్టుకున్నది పాకిస్తాన్. కాని పండిట్ నెహ్రూ ప్రధాన మంత్రిగా ఉన్నంతకాలం పాకిస్తాన్ సంకల్పం సిద్ధించదు.

దేశంలో కమ్యూనిస్టుప్రమాదం హెచ్చుగానే ఉంది. భారత-పాకిస్తాన్ సంబంధాలు విషమించేపక్షంలో దేశంలో అరాచకాన్ని ప్రోత్సహించి అధికారయంత్రాన్ని స్వాధీనంచేసుకోవాలని కమ్యూనిస్టుల సంకల్పం. సర్దార్ పటేల్ హోంశాఖామంత్రిగా ఉన్నంతకాలం వీరి సంకల్పమూ సిద్ధించదు. భారతదేశం ఈ మాత్రంగానైనా నిలబడి ఉండగలిగిందంటే మన అగ్రనాయకుల సామర్థ్యం, రాజనీతిజ్ఞతా, పరిపాలనాదక్షతే కారణం. వారి తరువాత భారతదేశం ఏమౌతుంది అంటే చెప్పలేము, గాంధితరువాత నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్ ప్రభృతులు లున్నారుగనుక భారతీయులు తలెత్తుకు తిరగగలిగారు.

సాంఘికంగా దేశం ముందుకు సాగిపోతున్నది. హిందూ ధర్మశాస్త్రసంస్కరణతో ఇంతవరకూ హిందూసంఘంలో ఉంటున్న తర, తమ భేదాలు తొలగిపోతవి. మన రాజ్యాంగం అందరినీ సమంగానే పరిగణించింది. వయోజనులందరికీ వోటుహక్కు లభించింది. 1951 లో రానున్న ఎన్నికల్లో భారతప్రజానీకం కోరుకున్న వ్యవస్థను నిర్మించడానికి అవకాశం లభిస్తుంది. అస్పృశ్యత శాసన విరుద్ధమైంది. 'కులతత్వం' కొన్ని ప్రభుత్వాల సంకుచితవిధానంవల్ల ఇప్పటికీ వర్ధిల్లుతున్న నూత్న రాజ్యాంగం అట్టి విచక్షణను నిర్వీర్యం చేస్తున్నది.

మనలను అనవరతము, అనుక్షణమూ కలవరపెడుతున్న సమస్య ఆర్థికసమస్య. ఆ సమస్యను పరిష్కరింపగలిగితే మన రాజకీయ స్వాతంత్ర్యం స్థిరపడిపోతుంది.

దేశసంపదను వృద్ధిచేయడం అందరి పరమావధి. వ్యవసాయిక, పారిశ్రామికోత్పత్తిని అధికంచేయడంద్వారానే ఇది సాధ్యం. రైతులు ఎక్కువధాన్యం పండించాలి. కూలీలు చీటికిమాటికి సమ్మెలుచేయడం మాని ఉత్పత్తిని అధికంచేయడానికి కృషిచేయాలి. రిపబ్లిక్ ప్రభుత్వం కార్మికులకు అనేకసౌకర్యాలను కల్పిస్తున్నది. అంతర్జాతీయకార్మికసంఘం ఆదేశాలను ఎప్పటికప్పుడు అమలుచేస్తూ ఉంది. రైతులు, కూలీలు రాజకీయాలకంటే వస్తూత్పత్తికి ఎక్కువ ప్రాధాన్య మిచ్చి పనిచేయాలి. అప్పుడే ధరలు తగ్గడం, ప్రజలజీవన ప్రమాణం వృద్ధికావడం జరుగుతుంది.

1951 నాటికి ఆహారంవిషయంలో దేశం స్వయంసమృద్ధం కావాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. ఆప్రకారం సస్యాభివృద్ధికార్యక్రమాలను కొనసాగిస్తూఉంది. అవి సఫలంఅవుతవా, కావా అనే అనుమానాలతో కాలయాపన చేయక అవి సఫలం కావాలనే దీక్షతో పనిచేయాలి.

ఆర్థికంగా భారతదేశస్థితి అంత ఆందోళనకరంగా లేదు. 1950-51 సంవత్సరంలో ఒకకోటిరూపాయలకుపైగా మిగులుంటుందని ఆదాయవ్యయఅంచనాలవల్ల స్పష్టమౌతున్నది. పారిశ్రామికులకూ పన్నులతగ్గింపుద్వారా ఎక్కువసౌకర్యాలను కల్పించి అధికోత్పత్తికి రిపబ్లిక్ ప్రభుత్వం దోహదంచేసింది. వీటన్నింటి ఫలితాలు 'వికృతి'లో అనుభవానికి రావాలని కోరుకుందాం. రాగలవని ఆశిద్దాం.

మన రాష్ట్రస్థితి అంత ఉత్సాహకరంగా లేదు. ఆహారసమస్య ఉరితాడులాగా పైన వ్రేలాడుతూనే ఉంది. కమ్యూనిస్టువిధ్వంసక చర్యలు సమసిపోలేదు. రాష్ట్రకాంగ్రెస్‌వ్యవహారాలు కుదుటపడ లేదు. స్పర్ధలు పెరిగిపోతున్నవి.

ఈ పరిస్థితుల్లో 'వికృతి' ప్రవేశిస్తున్నది. తృతీయసంగ్రామాన్ని 'వికృతి' కోరుతుందో, లేక ప్రపంచకల్యాణానికి సోపానం వేస్తుందో చూడాలి. భారతదేశానికి సంబంధించినంతవరకూ కాందిశీక పునరావాససమస్య పాకిస్తాన్‌తో సంబంధాలే ప్రమాదభరితంగా ఉన్నవి. యుద్ధాన్ని నిషేధిస్తూ ఉభయులం జాయింటుప్రకటన చేద్దామని భారతప్రధానమంత్రి ప్రతిపాదిస్తే పాకిస్తాన్ ప్రధాన మంత్రి తిరస్కరించాడు. అలాగే సంక్షుభితప్రాంతాల్లో కలిసి పర్యటిద్దామంటే అది ప్రయోజనంలేదని లియాఖత్ అలీఖాన్ నిరాకరించాడు. ఈవిధంగా కలిసిమెలిసి పనిచేయడానికి భారతదేశం చేసిన ప్రతిప్రయత్నాన్నీ పాకిస్తాన్ త్రోసిరాజంటున్నది.

రెండురాజ్యాలూ కామన్వెల్తులో ఉన్నవి. ఇంతవరకూ దక్షిణాఫ్రికా-భారతదేశాలమధ్య (కామన్వెల్తురాజ్యాల్లో) స్పర్ధలు ఏర్పడి వ్యాపారాంక్షలప్రయోగంవరకూ వెళ్లింది. ఇప్పుడా సమస్యా పరిష్కారానికి ప్రయత్నాలు ప్రారంభమైనవి. దక్షిణఆఫ్రికాలోని భారతీయులసమస్య పరిష్కారం అయితే గాంధిజీని కది రెండవ విజయం అవుతుంది. అలాగే భారత-పాకిస్తాన్ సంబంధాలూ చక్కబడితే భారతదేశం అభ్యుదయమార్గాన ముందుకు సాగిపోగలదు.

వర్తమానం ఎలా ఉన్నా స్వతంత్రభారతరిపబ్లిక్‌కు ఉజ్వలమైన భవిష్యత్తు ఉంది. దాన్ని సాధించేందుకు సమైక్యకృషి కావాలి. 'కృషితో నాస్తిదుర్భిక్షం'.

కృషి, మరింత కృషి అదే మన లక్ష్యం కావాలి. తద్వారానే మన ఈ రాజకీయస్వాతంత్ర్యాన్ని పదిలపర్చుకొని ఆర్థికప్రజాస్వామ్యాన్ని సృష్టించుకొని గాంధీదేశంగా యావత్ప్రపంచానికీ మార్గదర్శి కాగల్గినట్లు భారతదేశానికి రూపురేఖలు దిద్దగలం.

Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.